అలక్తకః=లత్తుక. రక్తః=ఎఱ్ఱనిది, ప్రేమించినవాఁడు. నిష్పీడ్య=పిడిచి. నిపాత్యతే=పాఱవేయఁబడును.

మారయ=చంపుము. సచివః=మంత్రి.

౧౪-వ పుట.

లోకానామ్=జనులయొక్క. పురః=ఎదుట. అవితథా=అబద్ధము కానిది (సత్యమయినది).

అర్థాన్=ధనములను. విషయిణః=విషయాసక్తుఁడయిన. అస్తంగతాః=తొలఁగినవి. భువి=భూమియందు. కాలస్య=యమునికి. గోచరత్వమ్=అగపడుటను. అగమత్=పొందెను. అర్థీ=యాచకుఁడు. వాగురాసు=వలలయందు. క్షేమేన=కుశలముగా. పుమాన్=మనుష్యుఁడు.

క్లీబే=నపుంసకునియందు. మజ్యాపే=త్రాగుఁబోతునందు. తత్త్వచిన్తా=అధ్యాత్మవిచారము. క్షాన్తిః=ఓర్పు. పటుః=సమర్థుఁడు. మహత్ అర్ణవే=మహాసముద్రములో. మస్తకే=శిరస్సున. సుప్తమ్=నిద్రితుని. ప్రమత్తమ్=పరాకుగానున్నవానిని. విషమే=ఇక్కట్టులో.

గూఢమ్=రహస్యముగా. అనుష్ఠితః=నెఱవేర్పఁబడినది. ఆదేశః=ఆజ్ఞ. సాధు కృతమ్=మంచిపనియే చేయఁబడినది. ప్రశశంస=పొగడెను. ఆఖేటక అర్థమ్=వేఁట కొఱకు.

౧౫-వ పుట.

నిర్ఘాతః=పిడుగు. ఉల్కాపతనమ్=కొఱవులు రాలుట.

శతధా=నూఱువిధముల.

ప్రాజ్ఞః=బుద్ధిమంతుఁడు. పన్నగైః=పాములతో. బృన్దమ్=సమూహమును.

అనాదృత్య=అలక్ష్యపెట్టి. న ఉత్పద్యేత=పుట్టదు.

దృష్టపూర్వః=పూర్వము చూడఁబడినది. శ్రూయతే=వినఁబడుచున్నది. హేమమయః=బంగారముతో చేయఁబడినది. తృష్ణా=ఆశ.

ఉపార్జితానామ్=సంపాదింపఁబడిన. ఉపభోగమ్=అనుభవము. సద్భావః=నమ్మకము. విరరామ=ఊరకుండెను. ఖడ్గ=కడితి. శరభ=సింహమును చంపునట్టి యెనిమిదికాళ్లజంతువు. వ్యాఘ్రః=పులి. కుల=సమూహముచేత. సంకులమ్=నిండినదైన. యావత్ పశ్చాత్ దదర్శ=ఎప్పుడు వెనుక చూచెనో. వర్గః=సమూహము. లగ్నః=అంటుకొన్నది (పోయినది). అద్రాక్షీత్=చూచెను. అవతీర్య=దిగి. అవగాహ్య=ప్రవేశించి. శాన్త పిపాసః=తీరిన దప్పికలవాఁడై. తరు=చెట్టుయొక్క. విశశ్రామ=విశ్రమించెను. సమాపతత్=వచ్చెను. యథా ఆగతమ్=వచ్చినదారినే. అధావత్=పాఱిపోయెను.

౧౬-వ పుట.

వేపమాన అఙ్గః=వణఁకుచున్న దేహముకలవాఁడై. ద్రుమమ్=చెట్టును. ఆరురోహ=ఎక్కెను. భల్లూకమ్=ఎలుఁగుబంటిని. ససాన్త్వమ్=ఓదార్పుతో. మా భైషీః=భయపడకు. శరణం గతః=శరణు చొచ్చినావు. న భేతవ్యమ్=భయపడ వలదు. ఋక్షరాజ=ఎలుఁగుదొరా. క్రతవః=యజ్ఞములు. అస్తమ్ అగాత్=పడమటి కొండను లేక క్రుంకుటను పొందెను (క్రుంకెను). పరిశ్రాన్తః=బడలినవాఁడై. అఙ్కమ్ ఆరోపితః=తొడమీఁద ఎక్కించుకొనఁబడినవాఁడై. సుష్వాప=నిద్రించెను. శత్రు భూతమ్=శత్రు వయినవానిని.

కృతమ్=ఉపకారము. తిర్యక్=భూమిపై పు కడుపు ఉండునట్లు నడచు జంతువు. యోనిః=జన్మస్థానము. తిర్యగ్యోనిషు=తిర్యగ్జంతువులయందు.

నిజ ఆశ్రయమ్=స్వకీయమయిన ఉనికిపట్టునకు. ఘాతుకాః=చంపువారు. దివాకర=సూర్యుఁడు. తిష్ఠ=ఉండు.

౧౭-వ పుట.

తథా భవతు=అట్లే అగునుగాక. ప్రసాదః=దయ. రుష్టాః=కోపగించినవారు. అ వ్యవస్థిత=వ్యవస్థ లేనిదైన (చంచలమయిన).

శాఖా అన్తరమ్=మఱియొక కొమ్మను. ఆలలమ్బే=పట్టుకొనెను. బిభాయ=భయపడెను. ప్రభాతమ్=ప్రాతఃకాలము. ఆచఖ్యుః=చెప్పిరి. సద్యః=వెంటనే. సముపనతమ్=సంప్రాప్తించినది. మార్గణాయ=వెదకుటకొఱకు.

౧౮-వ పుట.

మహా శోక సాగర నిమగ్నః=గొప్ప దుఃఖమనెడు సముద్రములో మునింగినవాఁడై. ఆదాయ=తీసికొనివచ్చి. ఉన్మాద శమనాయ=వెఱ్ఱి కుదురుటకు. పరమ్=మిక్కిలి. పదమ్=చోటు.

సహసా=విచారింపక. న విదధీత=చేయఁ గూడదు. విమృశ్య కారిణమ్=ఆలోచించి చేయువానిని. సంపదః=ఐశ్వర్యములు. గుణలుబ్ధాః=గుణములయందు ఆసక్తికలవై. స్వయ మేవ=తమంతటతామే. వృణతే=వరించుచున్నవి.

బ్రాహ్మణీ నకులే=బ్రాహ్మణస్త్రీని ముంగిసను గుఱించినకథయందు. భవితవ్యతా=కావలసినగతి. భావ్యమ్=కావలసినది. ఆయత్తమ్=అధీనము. అభితః నగరమ్=పట్టణ మంతట. ఉద్ఘోషయ=చాటింపించు.

౧౯-వ పుట.

ఆకర్ణ్య=విని. యవనికా అన్తః వర్తీ=తెర లోపల నున్న. ఆమన్త్రియత=పిలిచెను.

సద్భావ మితి=(దం.) నమ్మకము పొందినవారిని మోసము చేయుటయందు ఏమి నేర్పు? తొడ యెక్కి నిద్రించినవారిని చంపుటయందు ఏమి పౌరుషము?

సేతుమ్=శ్రీరాములవారు కట్టించిన యానకట్టును. ప్రముచ్యతే=వదలఁబడుచున్నది. మిత్ర ద్రోహః=స్నేహితుని చంపఁదలఁచుట.

కృత ఘ్నః=చేసినమేలు మఱచువాఁడు.

కల్యాణమ్=శుభమును. దేహి=ఇమ్ము. ద్విజాతిభ్యః=బ్రాహ్మణులకు

స్వస్థ మనాః=కుదిరిన మనస్సు కలవాఁడు. సావధానః=శ్రద్ధకవాఁడు. జగాద=చెప్పెను.

వససి=నివసించుచున్నావు. కల్యాణి=ఓశోభనురాలా. విపినమ్=అడవికి.

౨౦-వ పుట.

ద్విజ=బ్రాహ్మణులయొక్క. వాణీ=సరస్వతి. జిహ్వామ్=నాలుకను. ఆశ్రితా=ఆశ్రయించియున్నది. అఙ్కితమ్=మచ్చను.

ఆచకర్ష=లాగెను. సంసర్గేణ=సాంగత్యముచేత. సఙ్గః=సాంగత్యము. విధేయః=చేయవలసినది.

ఆగామినీమ్=రాఁబోవునట్టి. పీతమ్=త్రాగఁబడినదై. అమ్బుః=నీరు.

సంగ్రహః=చేర్చుట. కర్తవ్యః=చేయువలసినది.

కులీనస్య=గొప్పకులమువానియొక్క. సీదతి=నశించును. సమ్యక్=చక్కఁగా. ఆరూఢికః=ఆరూఢికుఁడను మంత్రి.

భోజే రాజని=భోజరాజు, సింహాసనమ్=సింహాసనమును, అధిరోఢుమ్=ఎక్కుటకు, సమీపమ్=దగ్గఱకు, ఉపయాతే=రాఁగా, ఏకా ప్రతిమా=ఒక బొమ్మ, వినివార్య=(అతనిని) అడ్డగించి, విక్రమార్క దేవస్య=విక్రమార్క రాజుయొక్క, గుణాన్=గుణములను, ప్రాహ=(ఇట్లు) చెప్పుచున్నది.

సంభావ్య=గౌరవించి. స్వ నగర అభ్యన్తరమ్=తన పట్టణము లోపలికి. కారయిత్వా=చేయించి (కట్టించి). దివ్య ఓషధి యుక్తైః=శ్రేష్ఠములైన తీఁగలతో కూడుకొన్నటువంటి. పురన్ధ్రీభిః=పేరఁటాండ్రచేత. నీరాజితః=ఆరతియెత్తఁబడినవాఁడై. అభినన్దితః=సంతోషపెట్టఁబడినవాఁడై. వన్దిభిః=స్తుతిపాఠకులచేత.

౨౧-వ పుట.

దాన మానాభ్యామ్=ఈవిచేతను గౌరవించుటచేతను. బధిర కుబ్జ ఆదిభ్యః=చెవిటివాండ్రు గుజ్జువాండ్రు మొదలయినవారికి. చత్ర=

గొప్పగు అత్యంత =గొప్పదైనవాఁడై, బాలభిక్షుకః సన్యాసి యొక్క ఱంమీఁద. ఔదార్య(మ్)= ఈవి. విద్యన్తై=కలవు. అన్యూనమ్ =తక్కువ కానిది. అభణత్ = చెప్పెను. అనుచితమ్ =తగనిది ప్రశంససి=పొగడుకొనుచున్నావు. కీర్తియతి=పొగడు(నొ). న వక్తి= చెప్పఁడు. శక్నోతి=సమర్థుఁడగుచున్నాఁడు.

విత్తమ్=ధనము. ఛిద్రమ్=కలత. గోప్యాని=దాఁప వలసినవి.

నిశమ్య=విని. విస్మితః=ఆశ్చర్యపడినవాఁడై. అవదత్ = చెప్పెను. తిష్ఠతు=ఉండుఁగాక. వాఞ్ఛతి=కోరుచున్నది. ప్రయచ్ఛేత్ =ఇచ్చును.

నిరీక్షితే=చూడఁబడెనా. నియుతమ్=పదివేలు. ప్రజల్పితే=సంభాషింపఁబడినయెడల

ప్రత్యావర్తత=మరలెను. ఇతి=ముగిసెను. ఉపాఖ్యానమ్ -కథ.

౨౨-వ పుట.

అనవాప్త కామమ్ =పొందఁబడని కోరికగలవాఁడైన. ఆర్త చేతసమ్=పీడింపఁబడిన మనస్సుగలవాఁడైన. కృతార్థయామాస=కృతార్థునిఁజేసెను. పాఞ్చాలికయా=బొమ్మచేత. అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

భూయః=మరల. సముపవిశ=కూర్చుండుము. ఆరేభే=ఆరంభించెను. ఆహూయ=పిలిచి. అబ్రవీత్ =పలికెను. పృథివీమ్ =భూమిని. పరిభ్రమతి=సంచరింపుఁడు. కౌతుక ప్రదమ్ =వినోదమును ఇచ్చునది. ఆయతనమ్—ఆలయము. వ్యజిజ్ఞపత్ =విన్నపించెను. నికట=సమీప. అతి ఉదగ్రాత్ =మిక్కిలి పొడుగైన. నిస్సరతి=బైలు వెడలుచున్నది. పూతః=పవిత్రుఁడు. కుండే=గుండములో. జుహోతి=హోమము చేయుచున్నాఁడు. అద్రాక్షీత్ =చూచెను. దేవః ప్రమాణమ్= ఏలినవారిచిత్తము.

౨౩-వ పుట.

విరరామ=మానెను. నిర్ఝరే=ఏటిలో. అపృచ్ఛత్ =అడిగెను. అ

హోస్త=అభ్యసించెద గ్రంథముతో కూర్చుండెను. అయతిష్ఠి=ఆరంభించితిని. జుహ్వతః మే=హోమమును చేయుచున్న నాకు. న విదధే=చేయ లేదు. ఇష్ట సాహసః=ఇష్టమయిన సాహసముకలవాఁడు, (సాహసము చేయఁగోరినవాఁడు). స్వ శీర్షమ్=తన తలను. ఉత్కృత్య=కోసి. నిచిక్షేప=వేసెను. కృపాణమ్=కత్తిని. వృణీష్వ=కోరు. అతి నియతః=మిక్కిలి నియమముకలవాఁడై. న చకర్థ=చేయకపోయినావు. ఫలాయ న కల్పతే=ఫలింపదు.

అఙ్గుళీతి=వ్రేళ్ల చివర చేత చేసినజపము, (వ్రేళ్ల)కణుపులను దాఁటుట చేత (లెక్క పెట్టుట) చేసిన జపము, పరధ్యానముగా చేసిన జపము, ఈమూఁడుజపములును నిష్ప్రయోజనములు.

కాష్ఠే=కొయ్యలో. పాషాణే=రాతిలో. మృణ్మయే=మట్టియొక్క వికారమందు. భావే=మనస్సులో.

దైవజ్ఞే=జోస్యునియందు. భేషజే=ఔషధమందు. యాదృశీ=ఎట్టిదో. భావనా=అభిప్రాయము.

మనోరథమ్=కోరికను. సంపూరయ=నిండింపుము. మహాద్రుమః=గొప్పవృక్షము.

౨౮-వ పుట.

ఛాయామ్=నీడను. ఆతపే=ఎండలో.

వహన్తి=ప్రవహించుచున్నవి. నిమ్నగాః=నదులు. దుహన్తి=పాలిచ్చుచున్నవి. భూరుహాః=చెట్లు. విభూతయః=సంపదలు. అన్తరధాత్=మాయమాయెను.

భూమిపాలః=రాజు. మహీసురాయ=బ్రాహ్మణునికి. ప్రదదౌ=ఇచ్చెను. అభిధత్తే=చెప్పుచున్నది.

అధ్యాసితవ్యమ్=ఎక్కఁదగినది. బ్రూహి=చెప్పుము. వికల్పః=భేదబుద్ధి. నిజః=తనవాఁడు. ఉదార చిత్తానామ్=దానశీలమయిన మనస్సుకలవారికి. వసుధా=భూమి. కుటుమ్బినీ=కుటుంబవంతురాలైనభార్య.

౭౫-వ పుట

శఙ్కతే=భయపడును. ఈప్సితమ్=కోరికను.

కృత ఇతి=(దం.) చేయఁబడినది దృఢసంకల్పము పురుషుని చేత, దేవుఁడు నెఱవేర్చుచున్నాఁడు కోరికను; విష్ణుచక్రము గరుత్మంతుఁడును లేవో వానికి ఎందుచేత యుద్ధములో. (ఇక్కడ, విష్ణువేషము వేసికొని రాజకన్యను స్వీకరించిన కౌళికునికి యుద్ధములో విష్ణువు తోడ్పడి తనగరుడచక్రములచేత వానికి జయము కలుగఁజేసెను అను పంచతంత్రకథను అనుసంధానము చేయవలయును.)

ఉత్సాహ...సక్తమ్=ఉత్సాహము గలవానిని, త్వరగానే పనులు చేయువానిని, పని చేయుట నెఱిఁగినవానిని, విషయములయందు తగులనివానిని. వాసహేతోః=(తాను) నివసించుటకై.

అధివాసః=నివాసస్థానము. మహీ=భూమి. న జ్ఞాయతే=తెలియఁబడదు. ప్రాప్నుయాత్=పొందును.

సంగ్రహః=సంకోచము (పిసినారితనము.) మధుకరాణామ్=తేనెటీఁగలయొక్క. సంచితమ్=కూడబెట్టఁబడిన. అనుభవత=అనుభవింపుఁడు. మాన్యమ్=పూజ్యని. అతి...లుళితా=మిక్కిలి కఠినమయిన గాలిచేత కదపఁబడిన. త్యాగః=ఈవి. పరీవాహః=కలుజు.

౭౬-వ పుట.

సర్వ స్వ దక్షిణమ్=సర్వ ధనము దక్షిణగాఁగలదైన. ఉపాక్రమత=ఆరంభించెను. ఆహ్వాయయత్=పిలిపించెను. ప్రైషయత్=పంపెను. పుష్ప అఞ్జలిమ్=పువ్వుల దోసిలిని. విక్షిప్య=చల్లి. దేదీప్యమాన శరీరః=మిక్కిలి వెలుఁగుచున్న దేహముగలవాఁడైన. ప్రతిగృహ్ణాతి=పుచ్చుకొనును. గుహ్యమ్=రహస్యమును. ఆఖ్యాతి=చెప్పును.

గిరా వితి=(దం)కొండలో నెమలి (కలుగు), ఆకాశములో మేఘము, లక్ష(యోజనముల)దూరములో సూర్యుఁడు, నీళ్లలో పద్మము, చంద్రుఁడు రెండులక్షలయోజనములలో, కలువ భూమిలో; ఏయిద్దఱికి స్నేహమో, లేదు ఆయిద్దఱికి దూరము.

అ మూల్యాని=వెల లేని. అమృత కల్పమ్=అమృతము వంటి. హస్తిన్=ఏనుఁగు. పదాతి=కాలుబంటు.

౮౭-వ పుట.

అవభృధ=దీక్షాన్త. అతిలఙ్ఘ్య=దాఁటి. అర్థిసాత్=యాచకాధీనము. రోచతే=రుచించు (నో). భవన=ఇల్లు.

ప్రవ్రజనమ్=దేశము వదలిపోవుటను. నియమనమ్=కట్టుటను. నిధనమ్=చావును. కార అగార నిషేవణమ్=చెర సాలయొక్క (యందు) సేవించుట(ఉండుట). లఙ్కేశ్వరే=రావణాసురునియందు. విడమ్బనాత్=ఆడంబరమునుండి.

విహితమ్=చేయఁబడినది. స్నుషా=కోడలు. ప్రసూతే=కను(నో).

౮౧-వ పుట.

ఆనన్దనమ్=సంతోషపెట్టునది. లగ్నః=తగిలినది.

కృతినా=కృతార్థుఁడైన. కుహనయా=వంచనచేత.

౮౯-వ పుట.

పరమ్=మఱియు. ప్రేయసీ=భార్య. జగాద=చెప్పెను. సమామనన్తి=చెప్పుచున్నారు.

తాపసః=తపస్వి శర్వరీ=రాత్రి. ప్రభాత=ప్రాతఃకాలము. రవిః=సూర్యుఁడు.

నాగ ఇతి=(దం.)ఏనుఁగు ప్రకాశించును మదముచేత, ఆకాశము మేఘములచేత, పూర్ణచంద్రునిచేత రాత్రి, పాతివ్రత్యముచే స్త్రీ, వేగముచేత గుఱ్ఱము, నిత్యోత్సవములచే ఇల్లు, వాక్కు వ్యాకరణముచేత, హంసజతలచేత నదులు, సభ పండితులచేత, మంచికుమారునిచే వంశము, రాజుచే భూమి, మూఁడులోకములు సూర్యునిచేత.

అవాదీః=చెప్పినావు. ఉద్యమేన వినా=ప్రయత్నము లేక. భవానీ వల్లభమ్=పార్వతియొక్క ప్రియుని (శివుని). భవతీ=నీవు. ఉపా

దేయమ్=గ్రహింపఁదగినది రుద్ర అనువాకైః=రుద్రునిగుఱించిన వేద మంత్రములచేత. అయజత్=ఆరాధించెను. మకుట=కిరీట. శైల... ......తనుః=పర్వతముకూఁతుచేత (పార్వతిచేత) కౌఁగిలింపఁబడిన ఎడమ దేహము (దేహముయొక్క యెడమపార్శ్వము) కలవాఁడై. అవతంసః=తలపువ్వు.

౩౦-వ పుట.

లిఙ్గినః=బ్రహ్మచారులు. మన్ద=శని. కల్ప=శాస్త్ర. ప్రాయచ్ఛత్=ఇచ్చెను. చౌలమ్=పుట్టువెండ్రుకలు తీయుట. అకార్షీత్=చేసెను. గోదాన=క్షౌర. అన్విష్య=వెదకి. మా కార్షీః=చేయకుము. భూతేషు=జంతువులయందు. మా విలోకయ=చూడకు. మర్మజ్ఞేషు=రహస్య మెఱిఁగినవారియందు. సదృశమ్=ఉచితముగ. వ్యయమ్=ఖర్చును. వారాణసీమ్=కాశికి. ఉవాస=వసించియుండెను.

౩౧-వ పుట.

సమిధః=చిదుగులను. విపినమ్=అడవిని. అవగాహ్య=చొచ్చి. సూకరమ్=పందిని. అనీనయత్=నడపించెను. న్యయుజ్క్త=నియోగించెను. హన్త=ఆహా. న విస్మరతి=మఱవఁడు.

ప్రథమేతి=మొదటి వయస్సునందు త్రాగఁబడినటువంటి నీటిని స్వల్పమును స్మరించుకొనునవై తలను ఉంచుకోఁబడిన బరువుకలవై కొబ్బరిచెట్లు మనుష్యులకు నీటిని అమృతమువంటిదానిని యావజ్జీవము ఇచ్చును. చేసిన యుపకారమును సాధువులు మఱవరు గదా.

ప్రత్యయమ్=రుజువును. విపణ్యామ్=బజారులో. మార్గణాయ=వెదకుటకు. ప్రాహిణోత్=పంపెను. నిస్సృః=కొనిపోయిరి.

౩౨-వ పుట.

లోలుపః—అత్యాశకలవాఁడవై. అపనలెపనః—తెఱవఁచుకొని. న శశాక=సమర్థుఁడు కాకపోయెను. ప్రేర్యమాణః=ప్రేరేపింపఁబడుచున్నవాఁడై. ప్రాక్ ఏవ=ముందుగానే. కర్మ అనుసారిణీ—కర్మను

అనుసరించునది. స్తేయీ=దొంగ. ఖాదిరేణ=చండ్రకొయ్యతో చేయఁబడిన. శూలేన=కొఱ్ఱుచేత.

చన్ద్రి ఇతి=(దం.) చంద్రుఁడు క్షయరోగి, స్వభావముచేతే వంకరైన దేహముగలవాఁడు, అపవాదము (మచ్చ) కలవాఁడు, దోషములకు గనియైనవాఁడు(రాత్రిని చేయువాఁడు), ప్రకాశించును స్నేహితుని (సూర్యుని) యాపత్కాలమందు; తలమీఁద అట్లయినను సర్వదా ధరింపఁబడుచున్నాఁడు శివుని చేత; లేనే లేదు ఆశ్రితులవిషయమై గొప్పవారికి గుణదోష విచారము.

33-వ పుట.

ప్రాకృతమ్=కర్మను. క్షమేత=సమర్థుఁడగును. విషమ ఆయుధః=కఠినములైన(జేసియైన)యాయుధములుఁగలవాఁడు. అనఙ్గః=మన్మథుఁడు. తావకమ్=నీదైన. న ప్రభవామి=సమర్థుఁడను కాను. సమాశ్వాస్య=ఓదార్చి. పర హిత కరణాయ=ఇతరులకు మేలు చేయుటకు. అనుజ్ఞాతః=సెల వియ్యఁ బడినవాఁడై. అయాసీత్=పోయెను.

34-వ పుట.

మణీ నితి=వెలలేని మణులను పదింటిని ఒకానొక వర్తకునివలన కొని వానిలోను ఐదింటిని పడవకై భృత్యునికి ఇచ్చి వచ్చినవానికి మిగిలిన మణులను ఆరాజు ఇచ్చెనని ఇందు చెప్పఁబడుచున్నది.

సోపానే=మెట్టుమీద. విన్యస్యతి=ఉంచుచుండఁగా. గిరమ్=మాటను. వ్యాజహార=చెప్పెను. ఆదాయ=పుచ్చుకొని. ఆకార్య=పిలిపించి. కియత్=ఎంత. మూల్యమ్=ఖరీదును. భూరి=విస్తారము. సార్థవాహ=సాహుకారా. జిజ్ఞాసు=పుచ్చుకొననిచ్చ. ఆదిదేశ=ఆజ్ఞాపించెను. మధ్యేపథమ్=మార్గమధ్యములో. కూల=గట్టు. నావికమ్=పడవవానిని. రత్న హరమ్=రత్నములను కొనిపోవువాఁడన యిన. ఉత్తారయ=దాఁటింపుము.

౩౫-వ పుట.

అయే పథిక=ఓ బాటసారీ. షేలామ్=గట్టును. ప్రతరణమ్=దాఁటుటను. నిగ్రహమ్=బాధించుటను. పూర్ణ సరిత్ తారే=నిండిన నదిని దాఁటుటయందు. కర్ణధార=ఓపడవవాఁడా. అరే=ఓరీ. సమానీతాని=తేఁబడినవి. యథా ఆదేశమ్=ఆజ్ఞ ప్రకారము. తటినీ=నది. ప్రతిభయమ్=భయంకరముగా.

ఆ జ్ఞేతి=రాజులకు ఆజ్ఞోల్లంఘనము, బ్రాహ్మణులకు అవమానము, స్త్రీలకు వేఱుపడకయు, కత్తిలేక చంపుటయని చెప్పఁబడును.

౩౬-వ పుట.

చరన్తమ్=చేయుచున్న. వర్ణినమ్=బ్రహ్మచారిని. ముదా=సంతోషముతో.

వధూ సమేతః=స్త్రీలతో కూడుకొన్న వాఁడై.

మాకన్దే ష్వితి.—నవ ఉదయేషు=క్రొత్త అభ్యుదయముకలవైన, మాకన్దేషు=తీయమామిడిచెట్లయందు, ముదితాః=సంతోషించినవై, మాధ్వీ రస ఆస్వాదినః=తేనెను త్రాగినవై, ఝుంకార ఏక పరాయణాః=ఝుంకారమనెడు ఒకదానియందే ఆసక్తములై, బమ్భరాః=తుమ్మెదలు, విరహిణామ్=ప్రియురాండ్రను ఎడఁబాసినవారికి, మానచ్ఛిదః=ధైర్యమును ఛేదించునవిగా(ఉండినవి). హృ...మాః—హృష్యత్=మొలచుచున్నటువంటి, పల్లవ తల్లజ=శ్రేష్ఠములైన చిగుళ్లయొక్క, అంకుర=మొలకలయొక్క, లవ=లేశములయొక్క, ఆస్వాద=తినుటచేత, ఉన్మిషత్=పుట్టుచున్న, పఞ్చమాః=పంచమస్వరముకలవై:పికాః=కోకిలలు, భూయః=విశేషముగా, భూపాలమ్=రాజును, రతి...తరమ్—రతి=వలపుయొక్క, విభ్రమ=విలాసముల చేత, ఆకులతరమ్=మిక్కిలికలరపడినవానినిగా: విదేయః=చేసినవి.

మన్దే నేతి.—మన్దేన=మెల్లనిదైన. చన్ద...తేన—చన్దన=గందపుచెట్లయొక్క, మహీధర=కొండయొక్క, మారుతేన—గాలిచేత,

కు...సాః—కుసుమ=పువ్వులే, అవతంసాః=శిరోభూషణములుగాఁగ లవైన, నవ లతాః=క్రొత్త తీఁగలు, వ్యానర్తితాః=నృత్యమాడిం పఁబడినవై, నరేశ్వరస్య=రాజుయొక్క, దృశౌ చ=కండ్లను, హృదయం చ=మనస్సును, ఘ్రాణం చ=ఘ్రాణేంద్రియమును, జహ్రుః=హరించినవి; మధురైః=తీయని, భృఙ్గ నినదైః=తుమ్మెదల నాదములచేత, శ్రవ శ్చ=చెవిని జహ్రుః=(హరించినవి).

### ౩౭-వ పుట.

సముద్దీపిత=పురికొలుపఁబడిన. ఆస్తీర్ణేషు=పఱపఁబడినవైన. సౌధేషు=మేడలయందు. వనితాభిః=స్త్రీలతో. అనైషీత్=గడపెను. మృతః తపః ఫలం భోక్తా ఇతి=చచ్చినవాఁడు తపస్సుయొక్క ఫలమును అనుభవించును అని. అనువిద్ధమ్=కూడుకొన్నది. అవ్యయ సుఖ ఉదర్కమ్=తరగని సుఖమే ఫలముగాఁగలదైన.

విషయ సంగమ జన్మ=విషయములతోడ సంయోగముచేత పుట్టువుగలదైన. ఉపసృష్టమ్=కూడుకొన్నది. వ్రీహీణ్=వడ్లను. తుష=ఊఁకయొక్క. ధరిత్ర్యామ్=భూమియందు.

సారఙ్గలోచనా—సారఙ్గ=తుమ్మెదలవంటి, లేక, లేడి(కన్నుల)వంటి, లోచనా=కన్నులుగలది; అనఁగా స్త్రీ. నితమ్బినీ=చక్కని పిఱుదులుగల స్త్రీ. దధౌ=ధరించెను.

### ౩౮-వ పుట.

పఞ్చాశత్=ఏఁబది. వ్యతీతాని=గడచినవి.

ఋణా...యేత్=ఋణములను (దేవఋణ ఋషిఋణ పితృఋణములను) మూఁడింటిని తీర్చివేసి మనస్సును మోక్షములో నుంపవలయును.

దాన శౌణ్డః=ఈవియందు ప్రసిద్ధుఁడైన. అనృతమ్=అసత్యమును. శూన్య లిఙ్గమ్=పాడుగుడిలోని శివలింగమును. అశ్వమేధ=గుఱ్ఱపుయజ్ఞముయొక్క. ఉద్వాహ=వివాహ.

౩౯-వ పుట.

అద్రి శృఙ్గే=కొండ శిఖరమందు. ప్రేత కబన్ధ యుగ్మమ్=చచ్చిన వారి మొండెములయొక్క జంటను. పృథు=గొప్ప.

కణ్టకః=నీచశత్రువు. షట్ కర్మ నిరతాః=యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహములు అను ఆఱు కర్మలయందు ఆసక్తులు. నిర్మమతా=తనది కాదని తలఁచుట. పరత్ర విషయే=పరలోక విషయమందు. సత్ ఉక్తిః=మంచి మాట. ఊరుజః=వైశ్యుఁడు. మర్యాదా=హద్దు. భువనే=లోకములో. జాతమ్=సమూహము.

గగన నగర కల్పః=ఆకాశ పట్టణము వంటిది (అసత్తయినది). వల్లభానామ్=ప్రియురాండ్రయొక్క. జలద పటల తుల్యమ్=మేఘసమూహములతో సమానమయినది.

౪౦-వ పుట.

విద్యుత్=మెఱుపువలె. వృత్తమ్=స్వభావమును.

శరణమ్=రక్షకము. బన్ధ మూలమ్=కట్టునకు కారణము. దారాః=భార్య. పరివిమృశత=ఆలోచింపుఁడు. శాత్రవమ్=శత్రువు.

హన్తి=చంపును. తత్ పదమ్=ఆ స్థానమును (బ్రహ్మమును).

భుజఙ్గ పుఙ్గవ పురీ సారమ్ శర్మ=నాగ శ్రేష్ఠునియొక్క పట్టణముయొక్క స్థిరాంశమయిన సుఖమును.

న్యస్తమ్=ఉంపఁబడినదై. శుక్తౌ=ముత్తెపు చిప్పయందు. పయోద బృన్దస్య=మేఘముల సమూహముయొక్క.

న్యగ్రోధస్య=మఱ్ఱిచెట్టుయొక్క. స్తోకమ్=చిన్నది.

ద్వారవతీమ్=ద్వారకాపురమునకు.

౪౧-వ పుట.

ఆతరమ్=రేవును. వైదేశికాః=పరదేసులను. ఘర్మ మేదురాః=ఘర్మముచేత దట్టమయిన. భిత్తి=గోడయొక్క. ద్వాత్రింశత్ లక్షణ ఉపేతః=ముప్పదిరెండు మహాపురుషలక్షణములతో కూ

డుకొన్నవాఁడు. రుధిరేణ=రక్తముతో. ప్రణామః=నమస్కారము. న పునర్భవాయ=పునర్జన్మమును పోఁగొట్టును. ఉషిత్వా=ఉండి. రిక్త పాణిః= శూన్యమయిన చేయిగలవాఁడై (చేకానుక ఏమియు లేక) నైమిత్తికమ్=నిమిత్తముకలిగినట్టి.

సమాససాద=కూర్చుండెను.

౪౨-వ పుట.

సార్థమ్=కూడ. కోశాత్=ఒరనుండి. ఇయేష=కోరెను. నిగద్యతే =చెప్పఁబడుచున్నది. అనన్య సాధారణమ్=ఇతరులకు చెంద నట్టిది.

౪౩-వ పుట.

వసుమతీమ్=భూమిని. కోశస్య=ధనముయొక్క.

కి మితి=దేశములో ఉసునకి విరోధము చేసి దేవపూజలు చేయుటచేత రాజునకు ఏమిఫలము? దేనిచేత రాజ్యమందు బ్రాహ్మణుల యొక్క జపయజ్ఞహోమములు నిలిచిపోక చక్కఁగా జరుగునో అదియే (రాజు) చేయవలసినది.

సకాశమ్=సమీపము. అచీఖనత్=త్రవ్వించెను, ఆయతనమ్= ఆలయమును. ముధా=వ్యర్థము.

౪౪-వ పుట.

అధి గగనమ్=ఆకాశములో. శత భార సువర్ణమ్=నూఱు బారువుల బంగారము. శరీర మమత్వమ్=దేహముమీఁద యభిమానము.

శరదామ్=సంవత్సరములయొక్క. సూరి=విద్వాంసులయొక్క. న విదధతి=చేయరు. ముక్తి=మోక్షము. ఉత్సుకాః=ఆసక్తులు.

రుజా=రోగముచేత. పరార్థితమ్=ఇతరులకొఱకైనది(ఇతరులకు పయోగపడునది)గా చేయఁబడినది. ప్రాసాద=దేవాలయ.

౪౫-వ పుట.

స్తూయమానః=పొగడఁబడుచున్నవాఁడై.

లతా అఙ్గీమ్=తీఁగవంటి దేహముకలదానిని (స్త్రీని). నిశాచర= రాక్షసునివలని. తదీయమ్=ఆమెదైన. ఆఖ్యాతవతే=చెప్పినవానికి.

మృతేః అభావాయ=చావుయొక్క లేమికై అనఁగా చావు తప్పుటకై. కుష్ఠ అభిభూతాయ=కుష్ఠవ్యాధిచేత ఆక్రమింపఁబడ్డవాఁడైన. ఆరురుక్షత్=ఎక్కఁగోరెను. పాఞ్చాలికా=బొమ్మ.

౪౬-వ పుట.

దురవాపాన్=పొందరానివానిని. నానా యోనిషు=నానా జంతువులయందు. దుర్వృత్తః=చెడ్డనడవడిక గలవాఁడవు. పరిభూయమానాః=అవమానింపఁబడుచున్నవారై. శిశిరే అబ్జం యథా=చలికాలమునందు కమలము వలె.

౪౭-వ పుట.

ప్రచ్ఛన్నగుప్తమ్=అగపడకుండదాఁపఁబడిన. దుష్ప్రాపా=పొందరానిది. అమిత జ్ఞః=అమితము నెఱిఁగినవాఁడను. ప్రాణంసీత్=నమస్కరించెను. కృపా తరఙ్గిత అన్తరఙ్గః=దయచేత అలలుగలదైన మనస్సుకలవాఁడై.

౪౮-వ పుట.

లాలసా=గొప్పకోరిక. ఉన్మాద=వెఱ్ఱి. అచల=పర్వత.

పాణ్డ్వబ్జ=తెల్లదామరయందు దాఁగిన తుమ్మెదల సమూహము లను చక్కనివానిని ఏది ధరించుచున్నదో బ్రహ్మయొక్క స్వరూపము అది చేయునుగాక మేలును నీకు.

ఆస్థాయ=కూర్చుండి. కలా వైదగ్ధ్యమ్=శాస్త్ర జ్ఞానమును. భాషిత మధునా=మాటల తేనెచే. వీటికామ్=తాంబూలమును.

౪౯-వ పుట.

ప్రహరః=జాము. అతీయాయ=గడచెను. సుష్వాప=నిద్రపోయెను. మఞ్చే=మంచమందు. విశ్రుతేన=ప్రసిద్ధమయిన.

౫౦-వ పుట.

ఆశాసీమహి=కోరుదుము. ఆశావాసః=దిక్కులనెడువస్త్రమును. వసీమహి=ధరింపుదుము. మహీ పృష్ఠే=(ఉత్త) నేలమీఁద. శయీమ

హి=పరుందుము. ఈశ్వరైః=ప్రభువులతో. కిం కుర్మోమహి=ఏమి చేయుదుము, అనఁగా ప్రభువులతో మా కేమియు పనిలే దనుట.

నిస్స్పృహః అధికారీ న స్యాత్=ఆశలేనివాఁడు పూనికగలవాఁడు కాఁడు. అకామీ మణ్డన ప్రియో న=కామములేనివాఁడు అలంకార ప్రియుఁడు కాఁడు. అ విదగ్ధః=నేర్పు లేనివాఁడు.

యది ప్రభవసి=సమర్థుఁడ వేని. అధ్యాత్మ కథాః=బ్రహ్మసంబంధమయిన ప్రస్తావములను. దూర్వా అఙ్కురైః=గరికచిగుళ్లతో.

౫౧-వ పుట.

వజ్ర కాయః=వజ్రమువంటి (దృఢమయిన) దేహముకలవాఁడవు. ఉజ్జయినీం సమయా=ఉజ్జయినికి సమీపమందు. హాయనమ్=సంవత్సరము. విశీర్ణ=శిథిలమయిన. అయి=ఓయి. సమిత్ కుశమ్=సమిధలు కుశలును. క్షమాణి=యోగ్యములు. నిరామయమ్=రోగరహితము.

౫౨-వ పుట.

పిశితాశన ఇన్ద్రమ్=రాక్షస శ్రేష్ఠుని. ఘసన్తమ్=తినుచున్నవానిని. ధరణీ విబుధాన్=భూ దేవతలను అనఁగా బ్రాహ్మణులను. పిశునః=కొండెగాఁడు. అరి=శత్రువులయొక్క. ప్రత్యర్థి భూభుజః=శత్రు రాజులను.

౫౩-వ పుట.

పర్యటతః=తిరుగుచున్న. దిశన్తః=ఇచ్చువారై. ఊషుః=ఉండిరి. సాధ్వీ=పతివ్రత. నిరన్తర చిత్తే=భేదములేని మనస్సుగలవాఁడైన. కలత్రే=భార్యయందు (భార్యకు). సౌహృద=స్నేహ.

౫౪-వ పుట.

అభ్యయాచన్త=ప్రార్థించినారు. ప్రాయచ్ఛన్=ఇచ్చినారు. శత వృద్ధా=నూరేండ్ల ముసలిది. సంక్రామన్తి=తగులును. పతఙ్గా నిజగదుః=పక్షులు చెప్పినవి.

శశిని ఉదయతి=చంద్రుఁడు ఉదయించుచుండఁగా. కామమ్=మిక్కిలి. అస్తమ్ యాతి=అస్తమించుచుండఁగా.

ఆత్మగత ఉదకాయ=తనయందున్న నీటికి. కృశానౌ=అగ్నియందు. తత్=ఆక్షీరము శామ్యతి=అణుచున్నది. క్షీరే ణేతి=పాలచేత తమయందున్న నీటికి ఆ గుణము లన్నియు పూర్వము ఇయ్యఁబడినవి. ఆ నీటిచేత పాలయొక్క కాఁగుటనుచూచి తనస్వరూపమే అగ్నిలో హోమముచేయఁబడినది. తనమిత్రముయొక్క యాపదను చూచి ఆ క్షీరము నిప్పులో పడుటకు లేచినది ఆయెను. యుక్తముగా ఆ నీటిచేత అణుచున్నది. సాధువులయొక్క చెలిమి యైననో మఱి ఇట్టిది. ఇందుల తాత్పర్యమే మనఁగా—పాలు తమగుణము లన్నిటిని నీళ్ల కిచ్చినవి. పాలు కాఁగునప్పుడు పాలకు కలిగినయాతాపమును చూడనేరక నీళ్లు నిప్పుచేత ఆవిరియైపోయినవి. తమమిత్రములయిన నీళ్లకు కలిగిన యాయాపదను చూడలేక పాలుకూడ నిప్పులో పడుటకు పొంగినవి. పాలకు కలుగనున్న యాయాపదను చూడలేక పొంగుమీఁద చల్లఁబడిననీరు ఆ పొంగును చల్లార్చినది. సజ్జనులయొక్క చిత్తము ఇట్లే పరదుఃఖముచేత దుఃఖము పొందుచుండును.

మహాసత్త్వ=సుఖదుఃఖములయందు మనోవికారము పొందక ఏకరీతిగా నుండుమహాధీరుఁడు. మ్రియేత=చచ్చును.

౫౫-వ పుట.

స్మేర ఆననః=నవ్వుచున్న ముఖముగలవాఁడవుగా. సమీహితమ్=కోరిక. అసహమానః=ఓర్వనివాఁడై. జిహాసతి=త్యజింపఁగోరుచున్నాఁడు. సర్వ సత్త్వ సుఖ ఏషిణః=సకలప్రాణులకు సుఖమును కోరువారు. పరాత్ అపి చ యాః పరాః=పైదానికంటెను ఏవి పైవో. వయస్య=చెలికాఁడా. అనుమానేన=ఊహచేత.

౫౬-వ పుట.

అభినన్దితః=ఆశీర్వదింపఁబడినవాఁడై. త్రపా=లజ్జచేత.

వేణు విపినే=వెదురు అడవిలో. రజనీచరేణ=రాక్షసునిచేత. రసన్తీమ్=ఏడ్చుచున్నదానిని.

౫౭-వ పుట.

పరిచ్ఛేదః=పరిమితి. వరాటికా=గవ్వ. ఆగామినః=రాఁబోవు నట్టి. భావ్యమ్=కావలసినది.

౫౮-వ పుట.

లోలత్వమ్=చపలత్వము. అపనయతః=పంపివేయువాఁడైనను. పదస్థస్య=ఉచితదశలో నున్న. కృశే=చిక్కినవానియందు(పేదయందు). సిద్ధః=సిద్ధుఁడను (సిద్ధులకు మనుష్యులు అగపడుదురు, సిద్ధులు మనుష్యులకంటికి అగపడరు)..

౫౯-వ పుట,

అతి గహనమ్=బొత్తుగా చొరరానిదైన. వేదికాయామ్=అరఁగు మీఁద. పరిత్రాయధ్వమ్=రక్షింపుఁడు. వర్ణ ఆవళిః=అక్షర పంక్తి అనఁగా మాట. అనయః=గడపినావు. ఆక్రన్దనమ్=ఏడ్పు. అపసర=పొమ్ము. జఘాన=కొట్టెను. మహీరుహః=చెట్టు.

౬౦-వ పుట.

బభాణ=చెప్పెను. ఉద్ధృతా=లేపఁబడిన దానను లావణ్యా=కాంతి. వితథమ్=వ్యర్థము. సపాదపతనమ్=పాదములమీఁదపడి.

౬౧-వ పుట.

తత్ వితీర్ణమ్=అయనచేత ఇయ్యఁబడిన. భూమికా అన్తర=మాఱువేషముచేత. తిరోహితః=తెలియఁబడనివాఁడై. సన్నిహితః=దగ్గఱనున్నది. భూతాని=జంతువులను.

౬౨-వ పుట.

దత్తమితి=దానము, యజ్ఞము, చేసినతపస్సు, తీర్థయాత్ర, వేదము, అన్ని అభయదానముయొక్క పదునాఱవభాగముకయినను తగవు. అభయదః=అభయమిచ్చువాఁడు. అధ్రువేణ=అనిత్యమయిన. నృభిః=మనుష్యులచేత. పత్న్యా=భార్యతో. ఉత్తితీర్షుః=దాఁటఁగోరినవాఁడై. అవగాహ్య=దిగి. త్యక్ష్యామి=వదలఁబోవుచున్నాను.

౭౩-వ పుట.

ఉత్కాలయితుమ్=గట్టునకు చేర్చుటకు. కృచ్ఛ్ర చాన్ద్రాయణ=వ్రతశేషములు. అశ్వత్థ పాదపే=రావి చెట్టునందు. నియుతమ్=పది లక్షలు.

౭౪-వ పుట.

ఆపృచ్ఛ్య=సెలవు పుచ్చుకొని. అన్వయుజ్క్త=ప్రశ్న చేసెను. అధ్వనీనః=బాటసారిని. ఉత్కణ్ఠా=కోరిక.

౭౫-వ పుట.

వికృతిః=వికారము, అపాయము. నియోగి=ఉద్యోగస్థులయొక్క. స్వైర విహార ధీరాః=స్వేచ్ఛగా తిరుగుటయందు చొరవఁగలవారు. దుగ్ధ=పాలయొక్క. వశంవదమ్=స్వాధీనము.

నేతా=నడపించువాఁడు. ప్రహరణమ్=ఆయుధము. నిగ్రహ దుర్గమః=దండనవలన ప్రవేశింపరానిది. హరేః=ఇంద్రునికి. బలభిత్=బలాసురునిచంపిన యింద్రుఁడు. సంగరే=యుద్ధమందు. ధిక్=ఛీ.

యే నేతి=ఎవనిచేత ఇంద్రుని యేనుఁగుయొక్క రోఁకళ్లవంటి దంతములు యుద్ధములో వంపఁబడినవో, ఎవనిచేత (పినాకమను విల్లు చేతఁగలవాఁడైన) శివుని గండ్రగొడ్డలియొక్క మొక్కవోని యంచు కొట్టఁబడినదో, మహిమకు ఇల్లయిన శ్రీరామలవారియొక్క భార్యయయిన జానకి ఎవనిచేత బాధింపఁబడినదో, రాక్షసుఁడైన అతఁడు కూడ చంపఁబడినాఁడు. ఎందుచేతననఁగా దైవము బలముగలది; లోకులచేత దాఁటశక్యమయినది కాదు గదా.

౭౬-వ పుట.

దైవమ్=అదృష్టము.

భగ్నాశ స్యేతి=(దం.)భంగముపొందిన యాశకలదైన బుట్టలో చుట్టచుట్టుకొన్న దేహముగలదైన శోషించిన యింద్రియములుగలదైన ఆఁకలిచేత, చేసి ఎలుఁక బొక్కను స్వయముగా పడినది రాత్రి

నోటిలో పాముయొక్క. తృప్తిపొందినదై ఆయెలుకయొక్క మాంసము చేత త్వరగా ఆపాము దానిచేతనే వెడలిపోయెను మార్గము చేత; స్వస్థులుగా ఉండుఁడు; అదృష్టమే ఉత్కృష్టమైన వృద్ధియందును క్షయమందును కారణము.

అకణ్టకమ్=క్షుద్రశత్రురహితముగా. వసున్ధరాధినాథే=రాజు.

పాత్వితి=(దం.) రక్షించును గాక మిమ్ములను పార్వతి తల్లి ఎవనికో (ఆ) పండ్రెండుకన్నులవాఁడు (కుమారస్వామి); ఆప్రకారమే పర్వతముయొక్క యల్లుఁడైన పండ్రెండింటిలో సగములో సగము కన్నులుకలవాఁడు (శివుఁడు).

౬౭-వ పుట.

విబుధవనితానాం=దేవతాస్త్రీయొక్క. కటాహే=గంగాళములో. సమ్మగ్నః=మునిగినవాఁడై. జ్వలనపరితప్యత్ తిలరసే=మంట చేత తెరలుచున్న నూనెగలదైన. ఉదస్తమ్=వార్తను.

ధారా=ధారాపురముయొక్క. అభిషేకాత్=స్నానముకంటె. గాఙ్గైః=గంగాసంబంధమయిన. తోయైః=నీళ్లచేత. నియత ఆత్మనామ్=ఇంద్రియ నిగ్రహముకలవారైన.

౬౮-వ పుట.

గఙ్గా జల ఆప్లుతః=గంగా జలములో స్నానము చేసినవాఁడు. తూలరాశిః=దూది రాశి. కాయ=దేహముయొక్క. విధి యుక్తమ్=దైవవశమున (భక్తిచేతకాకపోయినను). ప్రసభేన=బలాత్కారము చే. కీర్తనాత్=చెప్పుటచే. సుర అఙ్గనా=దేవకన్య. లోహ=ఇనుప.

౬౯-వ పుట.

సత్త్వ=బల. అప్సరాః=అప్సరస. దిష్ట్యా=(ఆనందమును తెలియఁజేయును). పీయూషమ్=అమృతమును. ఆనీయ=తెచ్చి. మామకం ఛన్దమ్=నా (దైన) అభిప్రాయమును.

౭౦-వ పుట.

ప్రవయసే=ముసలివాఁడైన. విదిశః=మూలలను. ఉపదాః=కానుకలను. దైవజ్ఞః=జోస్యుఁడు. సచివమ్=మంత్రిని. కుసుమ ఆకరః=పువ్వులకు గనియైనది.

వకుళాః=పొగడచెట్లు సకల ఆశాః=అన్నిదిక్కులు. భ్రమరీ నినాద గీతాః=ఆఁడుతుమ్మెదలయొక్క నాదమనెడు పాటకలవి. ఆయత=పొడుగైన ప్రమదాః=స్త్రీలు ప్రసూన లోలాః=పువ్వులయందు ఆసక్తికలవారై.

అగ్ర్య=శ్రేష్ఠమయిన. సమన్ద్ర నాదాః=మన్ద్రధ్వనులతోఁ కూడుకొన్నవైన. ఇన్దిన్దిరాః=తుమ్మెదలు. నిబిడయన్తి=దట్టము చేయుచున్నవి. వనితా...మధురాః=స్త్రీలయొక్క కమలమువంటి ముఖములయొక్క పరిమళమనెడు పరిమళద్రవ్యధారణముచేత మనోహరములైన. మన్ద అనిలాః=మెల్లని వాయువులు. అజస్రమ్=సర్వదా. వాన్తి=వీచుచున్నవి.

౭౧-వ పుట.

పుష్పవతీమ్=పువ్వులుగలదానిని, ముట్టుదానిని. మారుతః=గాలి. తౌర్యత్రిక=నృత్తగీతవాద్యములయందు. శతపత్ర=కమలము. కేతకీ=మొగలి. కరవీర=గన్నేరు. వాదిత్ర=వాద్యములు.

కల్యాణోత=శివునియొక్క చేయి పట్టుకొనుటయందు (వివాహమందు). (ఆయనచేతి) కంకణమైయున్న పాముచేత భయపెట్టఁబడినదైన పార్వతియొక్క బెదరిన చూపులుగలదియు తటాలున 'నమశ్శివాయ' అని పలికి సగములోనే లజ్జచెంది వంగినదియునైన ముఖము నీకు మంగళములు ఇచ్చునది అగునుగాక.

౭౨-వ పుట.

బ్రుసీమ్=ఆసనమును. తత్ తులితేన=దానికి సరితూగెడు. ఉదీరితామ్=చెప్పఁబడిన. వసు=ధన. అన్తరేణ=అక్కఱలేకుండ. చక్రే=నెఱవేర్చెను. వితస్తార=వ్యాపింపఁజేసెను.

## ౭౩-వ పుట.

శారికాః=గోరవంకలు. రణ దున్దుభి నిస్స్వానైః=యుద్ధ భేరీ ధ్వనులచేత, పశు పాషాణ పాదపాః=గో శిలా వృక్షములు అనఁగా కామధేను చింతామణి కల్పవృక్షములు. వన్దినమ్=స్తుతిపాఠకుని. ఏధతే=వృద్ధిపొందుచున్నది.

## ౭౪-వ పుట.

హోష్యసి చేత్=హోమము చేయఁదుచేని. ఊరీకృత్య=అంగీకరించి.

## ౭౫-వ పుట.

శిఖరి=పర్వత. అతిమాత్ర స్వర్ణ దామ్=అపరిమితమయిన బంగారమును ఇచ్చునదైన. ఖరకిరణ సకాశాత్=సూర్యుని వలననుండి.

మనీషీ=విద్వాంసుఁడు. కళత్రమ్=భార్యను. సిన్ధురాజః=సముద్రరాజు. విధేయ=చేయవలసినది.

కన్దళయతి=మొలకలెత్తునట్లు చేయును. నిన్దతి=దూషించును. భృశమ్=మిక్కిలి. మణ్డయతి=అలంకరించును. సంధత్తే=సమకూర్చును.

అక్షయమ్=నాశములేని.

ప్రజ్ఞాసంపాదనే=తెలివికలుగఁజేయుటయందు. వీర సూమ్=వీరులను కనునది. అదృష్ట దోషామ్=కనిపట్టఁబడని దోషముగలదానిని (దోషము కనిపట్టకయే).

## ౭౬-వ పుట.

మృషా=అబద్ధమును. కుత్రత్యః=ఎక్కడివాఁడవు. ఆదిత్యస్య=సూర్యునియొక్క. నిమజ్జతి=మునుఁగును.

## ౭౭-వ పుట.

సముద్గారిభిః=క్రక్కుచున్న. ప్రసూతి=సృష్టి. త్రయీమయాయ=వేదస్వరూపుఁడైన. త్రిగుణ ఆత్మ=సత్త్వరజస్తమస్సులయొక్క స్వరూపమును. అర్యమణమ్=సూర్యుని. విభావసుః=సూర్యుఁడు.

వేదాన్తే ష్వితి=(దం.) ఉపనిషత్తులయందు ఎవనిని చెప్పుదురో ఒకఁడేయాత్మను (గా) వ్యాపించి ఉన్నవానిని భూమ్యాకాశములను, ఎవనియందు ఈశ్వరుఁడని అన్యుఁడర్థముగాని శబ్దము వాస్తవార్థము గల వర్ణములు గలదో, మనస్సులో ఎవఁడు మోక్షముకోరినవారిచేత నిర్బంధింపఁబడిన ప్రాణాదులు గలవారిచేత వెదకఁబడుచున్నాఁడో, ఆ శివుఁడు దృఢమైన భక్తియోగముచేత సులువుగా దొరకువాఁడైన మంగళమునకు అగునుగాక మీకు. (విశ్వమందు వ్యాపించియున్న యొక్కఁడే యయిన బ్రహ్మమని యుపనిషత్తులలో చెప్పఁబడినవాఁడును, మఱియెవ్వనికిని పేరుగాని ఈశ్వరుఁడు అను పేరు గలవాఁడును, ముముక్షువులచేత ప్రాణాయామపూర్వకముగా తమమనస్సులలోనే వెదకఁబడువాఁడును, భక్తిమార్గమునకు సులభుఁడునైన శివుఁడు మీకు మేలును చేయునుగాక.)

౭౮-వ పుట.

రసాయనమ్=దివ్యౌషధము. రత్నాకర మేఖలామ్=సముద్రమే మొలనూలుగాఁగలదైనభూమిని. ఉర్వరా=సకలసస్యసంపూర్ణ.

౭౯-వ పుట.

అపదానాని=ఉత్కృష్టకర్మలను. మల్లాః=వస్తాదులు. నఖ అఙ్కుర సముల్లాసిత శ్మశ్రవః=గోళ్ల మొలకలతో (కొనగోళ్లతో) దువ్వఁబడిన మీసముగలవారై. ఆముష్మిక ప్రీతిమ్=స్వర్గమందు అభిమానమును. మృగవధాజీవః=వేఁటకాఁడు. సప్రశ్రయమ్=వినయముతో. అఞ్జన అచల సంకాశః=కాటుక కొండతో సమానమయినది. అశ్రుతపూర్వః=పూర్వము (ఎన్నఁడును) వినఁబడనిది. అదృష్టపూర్వః=పూర్వము చూడఁబడనిది. మృగయూనామ్=వేఁటకాండ్రకు. ఘర్ఘర ఆరవ ముఖరమ్=ఘర్ఘర ధ్వనితో శబ్దించుచు. అహమహమికా=నేను నేనని చొరవచేసి పోవుట. శూరమానినామ్ పశ్యతా మేవ=శూరులమని భావించుకొనువారు చూచుచుండఁగానే (వారిని లక్ష్యపెట్ట

క). కన్దరమ్=గుహను. అభ్రిజ్కాష=ఆకాశమునొరయుచున్న. హర శిఖరి సహోదరమ్=శివ గిరికి తోఁబుట్టైన (కైలాసమువంటి).

౭౦-వ పుట.

మార్గాణతామ్=యాచకత్వమును. ఆలలమ్బే=ఆశ్రయించెను. మన్యే=తలఁచుచున్నాను.

౭౧-వ పుట.

దుర్గతి=దారిద్ర్యముచేత. పర్యాప్తమ్=చాలిన. బుభుక్షయా=ఆఁకలిచేత. ధాతవః=లోహములు.

౭౨-వ పుట.

స దణ్డ కన్థామ్=కఱ్ఱతోను బొంతతోను కూడుకొన్న. ఖటికామ్=బలపమును. విపక్ష భూపైః=శత్రు రాజులచేత. దిదేశ=ఇచ్చెను.

౭౩-వ పుట.

పరభాగః=ఉత్కర్ష. తులామ్=త్రాసును, తులారాశిని. జలదపటలాని=మేఘసమూహములను.

౭౪-వ పుట.

నీచమ్=లోఁతు, పల్లము. రసాతలమ్=పాతాళము. వ్యవసాయినామ్=ప్రయత్నించువారికి. నాతిపారః=దూరమయిన అవతలిగట్టు గలదిగాను (దగ్గఱ). మహోదధిః=పెద్దసముద్రము.

పర=శత్రువు. కరాళ వదనమ్=భయంకరముఖముగలదైన. ఉద్వమన్తమ్=వెడలఁగ్రక్కుచున్న. ఆవృత్య=చుట్టుకొని.

౭౫-వ పుట

అభ్యగ్ని=నిప్పునెదుట.

౭౬-వ పుట.

అపససార=అవతలికి పోయెను.

అమరీ=దేవస్త్రీచేత. రస కుమ్భమ్=పాదరసపు కుండను. అనర్గళః=అనర్గళుఁడను పేరుగలవాఁడు. ప్రేతః=శవము.

౮౭-వ పుట.

ద్రవిణ=ధన. షణ్డ మణ్డితమ్=సమూహము చేత అలంకరింపఁబడినదైన. బాఢమ్=సరియే, అలాగే. పరేద్యుః=మఱునాఁడు. అభ్యధాయి=చెప్పఁబడెను. ఉపస్థాయ=ఆరాధించి.

౮౮-వ పుట.

కలాపమ్=సమూహమును. అవికలాని=దృఢమయినవి.

౮౯-వ పుట.

నీల మహీధ్రే=నీల పర్వతమందు. ద్విజాతయే=బ్రాహ్మణునికి. అభ్రంలిహా=ఆకాశమును నాకునట్టి. వాచామ్ అగోచరమ్=మాటలకు విషయము కానటువంటి.

౯౦-వ పుట.

క్షమేథాః=క్షమింపుదువు. కరుణాబ్ధే=దయాసముద్రుఁడా. ముకున్ద=మోక్షమిచ్చువాఁడా.

త్రిలోకేశ ఇతి=మూఁడులోకములకు ప్రభువయిన విష్ణువు (కృష్ణుఁడు) చెంచువాండ్రబాణములకు గుఱియైనాఁడు, లోకములను చేయువాఁడు (బ్రహ్మ) శిరశ్ఛేదమును పొందినాఁడు, ప్రసిద్ధులైన సూర్య చంద్రులు రాహువునకు కబళమయినారు, సర్వేశ్వరుఁడైన సాంబమూర్తి దిగంబరుఁడైనాఁడు, తల వ్రాత యెవఁడు దాఁటును?

పరిమార్జనమ్=తుడుచుటకు. ఉపాదేయమ్=గ్రహింపఁదగినది.

పద్మజన్మనః=బ్రహ్మదేవునివలననుండి (యైనను).

౯౧-వ పుట.

నోద్ఘాట్యతే=తెఱవఁబడదు. రక్త సేచనమ్=రక్తములో తడుపుట. ఆలోకన=చూచుటయొక్క. కోశమ్=బొక్కసమును. జనసాత్=జనులకు దానము.

౧౫౨-వ పుట.

గరీయసీ=గొప్పది. అక్తః=అభ్యంజనము చేయఁబడినవాఁడై. అసి=కత్తి. అభ్యవహజహార=భోజనముచేసెను. ఆతుర=రోగులను. ద్విత్రైః=ఇద్దఱుముగ్గురితో.

౧౫౩-వ పుట.

భుక్త్వా ఉపవిశతః మన్దమ్=భుజించి కూర్చుండు వానికి అగ్నిమాంద్యము (కలుగును). సంవిశతః=పరున్నవానికి. క్రమమాణస్య=నడచువానికి. ధావతః=పరువెత్తువానికి.

దివా సుప్తేః చ=పగలు నిద్రించుటచేతను. పురీష=మలము. నిదానైః=కారణములచేత.

మరీచి మాలీ=కిరణ మాలికలు కలవాఁడు, సూర్యుఁడు. చరమగిరి=పడమటి పర్వతము. అవతతార=దిగెను. ఉల్లోచ=చాందిని, మేలుకట్టు. పర్యఙ్కే=మంచమందు.

కుఞ్జర=ఏనుఁగు. వనస్పతి=పూవక కాచెడు చెట్టు. విష్ఠా అనులేపః=అశుద్ధపు పూఁత. వాహవైరి=దున్నపోతు. ఉష్ట్రిక=లొట్టిపిట్ట. కార్పాస=దూది. పోత్రి=పంది. శాఖామృగ=కోఁతి.

౧౫౪-వ పుట.

అరుణోదయ=వేకువ. అరిష్ట=అశుభ. ఆజ్య అవేక్షణమ్=నేతిని చూచుట. భణ్డారమ్=బొక్కసమును. ముక్తవాన్=వదలివేసెను. జహ్రుః=హరించిరి, కొనిపోయిరి.

యుధి=యుద్ధములో. తత్కృతా=దానినివివరించినశాలివాహనునితో. విగృహ్య=పోరి. ఉపాస్య=కొలిచి. వాసుకిమ్=నాగరాజును.

౧౫౫-వ పుట.

పరేతే=చచ్చినయెడల. ఉదియాయ=ఉదయించెను. తాతపాదైః=నాయనగారిచేత. చఖ్నుః=త్రవ్వినారు. తామ్రసంపుటాని=రాగిపెట్టెలు. మృత్=మన్ను. అఙ్గారః=బొగ్గు. పలాలమ్=పొట్టు.

౯౬-వ పుట.

కుమ్భకార=కుమ్మర. స్వస్తి...గరిష్ఠాః=మేలు, శ్రీగల యజ్ఞము చేయుట,—చేయించుట, వేదము చదువుట,—చెప్పుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, అను అఱుకర్మలయందు ఆసక్తులును, (అహింసాసత్యాస్తేయాప్రతిగ్రహములను) యమములును, (శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానములను) నియమములును, మొదలయిన గుణములచేత మిక్కిలి గొప్పవారును(అగు). అన్తికమ్=సమీపము. వాచయిత్వా=చదివి. అవాదిషుః=చెప్పినాడు. ప్రత్యర్థి పృథ్వీ నాథ=శత్రురాజుల. సహస్రపత్త్రి=కమల. వతంసః=శిరోభూషణము.

౯౭-వ పుట.

కియాన్=ఏపాటివాఁడు. అక్షౌహిణీ=౨౧౮౭౦ రథములు, అన్ని యేనుఁగులు, ౬౫౬౧౦ గుఱ్ఱములు, ౧౦౯౩౫౦ కాల్బంట్లును, గల సేన. చతుః అఙ్గ బల సమేతః=రథ గజ తురగ పదాతు లను నాలుగు భాగములుగల దండుతో కూడుకొన్నవాఁడనై. సమర అఙ్గణే=యుద్ధ క్షేత్రమందు. సఙ్గర రఙ్గమ్=యుద్ధక్షేత్రమునకు. అవజగాహే=ప్రవేశించెను.

చకితః=బెదరినవాఁడాయెను. పృథ్వీధరాః=కొండలు. భ్రాన్తా=దిర్దిరఁదిరిగెను. విషధరాః=పాములు. క్ష్వేళమ్=విషమును. ఉత్కటమ్=అత్యంతముగా. చమూ నిర్గమే=సేన బైలువెడలుటలో.

పవన మతి గతీనామ్=గాలియొక్కయు మనస్సుయొక్కయు గమనముకలవైన. ఘన నిభ గజ యూథా=మేఘముల వంటి యేనుఁగుల మందగలది. పతాకా=జెండాలచేత. ఖమ్=ఆకాశము. పటహా=డప్పులయొక్క. నభః=ఆకాశము.

౯౮-వ పుట.

ప్రభూత=మిక్కిలి. సంకులమ్=తుముల. విహ్వలః=ఆశ్చర్యపడినవాఁడు. ఆశీవిషైః=పాములచేత.

హారే రితి=విష్ణుమూర్తి వరాహావతార మెత్తినప్పుడు, ఆవరాహముయొక్క కోర కామగాను ఆపైభూమి గొడుగుగాను ఆపైమేరు పర్వతము బంగారపు కలశముగాను (గొడుగుకామమీఁదిగుబ్బగాను) ఉండెను. అట్టి యాకోర మిమ్ము రక్షించునుగాక.

౯౯-వ పుట.

న ఉజ్ఝతి=వదలఁడు. బిభర్తి=మోయుచున్నాఁడు. సుకృతినః=సుకృతముకలవారు, సజ్జనులు.

అసకౌ=ఇతఁడు. ద్వాదశవార్షికమ్=౧౨ ఏండ్లుండునదైన. భావినమ్ అవగ్రహమ్=రాఁబోవునట్టి యనావృష్టిని. ఆశాపూరణ్యై=ఆశాపూరణియనుదేవతకు. మఙ్గళః=అంగారకుఁడు.

౧౦౦-వ పుట.

శమ్=సుఖమును. భూతికరాః=ఐశ్వర్య మిచ్చునవి. దైవజ్ఞ=జోస్యుఁడా. భౌమః=అంగారకుఁడు. రోహిణీశకటమ్=బండియొక్క ఆకారముకలదైన రోహిణీ నక్షత్రమును. వరాహమిహిరేణ=వరాహమిహిరునిచేత. అర్కసుతేన=శనిచేత. వారిదః=మేఘుఁడు.

౧౦౧-వ పుట.

స్వారాట్ నియుక్తామ్=ఇంద్రునిచేత పంపఁబడిన. సురభిమ్=కామధేనువును. వ్యాహరతి=చెప్పుచున్నది. అయతిష్ట=యత్నించెనో.

౧౦౨-వ పుట.

త్రయస్త్రింశత్ కోటయః=ముప్పదిమూఁడుకోట్లు. ఏకోనపఞ్చాశత్ మరుద్గణాః=నలుబదితొమ్మిది వాయుగణములు. బహురత్నా=అనేక శ్రేష్ఠవస్తువులుగలది (అనేకులు గొప్పవారు గలది).

౧౦౩-వ పుట.

సానన్ద మితి=శూలము చేతియందుఁ గలవానియొక్క (శివునియొక్క) తాండవమందు ఆనందముతో నందీశ్వరుని చేతులచేత వాయింపఁబడిన మద్దెళయొక్క ధ్వనిచేత పిలువఁబడినదైన కుమారస్వామిదైన

వెములివలని భయము వలన నాగరాజు పడగ ముణుంచుకొని తొండము యొక్క కొనయొక్క బొక్కలో దూరుచుండఁగా ఫీట్ అనుశబ్దము కలవియు గండ(స్థల)ములనుండి ఎగిరిన తుమ్మెదలయొక్క బారుచేత ధ్వనికలవిగాఁజేయఁబడిన దిక్కులు గలవియు నైన విఘ్నేశ్వరుని నైన శిరఃకంపములు చిరకాలము మిమ్ము రక్షించునుగాక.

గ్రాస మితి=(ప్రయాణముచేసి వచ్చిన భర్తకును భార్యకును సంభాషణ). భర్త.—ఓచక్కనిదానా బాటసారినైన నాకు అన్నము పెట్టు. భార్య.—అయ్యయ్యో (ఆ)మాటలు నిష్ఫలములు. భర్త.—ఎందుచేతనో చెప్పు. భార్య.—చెలువుఁడా ఇదేమి క్రొత్తా? భర్త.—(దీనికి)హద్దు ఏమియు లేదా? భార్య.—యావ జ్జీవమును ఇది. భర్త.—వేఱు జన్మము కలుగదా? భార్య.—ధన ప్రభావముచేత ఇది. (ఈజన్మమున ధనము కలిగి దానధర్మములు చేసికొన్నయెడల ముందు దారిద్ర్యము లేని మంచిజన్మము కలుగునుగాని అన్యథా కలుఁగదని తాత్పర్యము). భర్త.—నాసర్వధనమును హరించువాఁడుగా ఎవఁడు సంభవించినాఁడు? భార్య.—దారిద్ర్యమను పేరి కుమారుఁడు.

౧౦౪-వ పుట.

రుధిరేణ=రక్తముచేత. కితవాయ=జూవగానికి.

నిరాచకార=నిరాకరించెను. వ్యాజహార=చెప్పెను. ధరా పర్యటన అర్థమ్=లోక సంచారము కొఱకు. శ్రుతి స్మృతి విహిత అనుష్ఠాన తత్పరాః=వేదములయందును ధర్మశాస్త్రములయందును విధింపఁబడిన వానిని ఆచరించుటయందు ఆసక్తిగలవారు. దుకూల=తెల్లపట్టు, మృగనాభి=కస్తూరి. గణికాభిః=భోగమువాండ్రతో.

౧౦౫-వ పుట.

కపోల=గండస్థల. భృఙ్గాః=తుమ్మెదలు. ప్రోత్ఫుల్ల...ఙ్గాః=మిక్కిలి వికసించిన కమలముల పరాగముచేత పరిమళవంతములుగాఁజేయఁబడిన యవయవములు కలవి, సామ్ప్రతమ్=ఇప్పుడు. నిమ్బే

షు=వేపపువ్వులలోను. అర్క=జిల్లేడు. సహకార పుష్ప వాటీ=తియమామిడి పువ్వుల వరుసయొక్క.

మన్దాకినీ... ధ్యే=ఆకాశగంగయొక్క తెల్లని యున్నతములైన కెరటముల నడుమ. శైవాల... లమ్=నాచుమొత్తముచే దట్టమైన.

వా... లః=గాలిచేత కదపఁబడిన గంగాసంబంధమైన కమలములయొక్క పుప్పొడియను పచ్చని మైపూఁతచేత వెలుఁగుచున్నదై. కల... తమ్=మధురమయినరుతము. మధులిహామ్=తుమ్మెదల యొక్క. ఉ ఇజ్చాపుట=ముక్కుచేత. బిస=తామరతూఁడుయొక్క. మరుగతః=నిర్జలభూమికిపోయినదై. కష్టమ్=అయ్యో. మార్గతే=వెదకుచున్నది.

కులాలవత్=కుమ్మరవానివలె. దురోదర=ద్యూత.

౧౦౬-వ పుట.

గ్రహ=రాహువుయొక్క. విధిః=అదృష్టము. వ్యసనానామ్=దుఃఖములకు. సద్మ=ఇల్లు. అగ్రయాయీ=ముందుపోవునది, దారిచూపునది, తీసికొనిపోవునది. సురా=సారాయి. ఆఖేట=వేఁట. పరి అఙ్గనాః=పర స్త్రీలు. అభిభూతః=ఆక్రమింపఁబడినవాఁడు. ధర్మసుతః=ధర్మరాజు. పలాత్=మాంసముచేత. బకః=బకాసురుఁడు. మృగాన్తకతయా=లేళ్లకు యముఁడగుటచే. అర్దితాః=పీడితులు.

౧౦౭-వ పుట.

అమన్త్రయేతామ్=మాటలాడుకొనిరి. పఞ్చ ధనుః ప్రమాణే=అయిదు విండ్ల దూరమున. శ్వభ్రే=గోతిలో. బలిభావాత్=బలియగుటనుండి. అపనునోద=తప్పించెను. భద్రాసనమ్=సింహాసనమును. తరఙ్గిణీ=నది. విటపి=చెట్లయొక్క.

౧౦౮-వ పుట.

వరణ=ప్రాకారముచేత. అప్రాక్షీత్=అడిగెను. పురుష ఉపహారమ్=నర బలిని. ప్రవృత్తిమ్=వార్తను. కర్ణ=శ్రోత్ర.

బ్రాహ్మీ త్వా కృతి=కమలమువలెను చంద్రునివలెను సౌమ్యమయిన ము

ఖముగలదైన బ్రాహ్మియు, విలాసముచేత మాహేశ్వరియు, శత్రు సమూహములను నాశము చేయునదైన కౌమారియు, చక్ర మాయుధముగాఁగలదైన వైష్ణవియు, గొప్పభయంకరమయిన ఘుర్ఘురిధ్వనికలదయిన వారాహియు, వజ్రము ఆయుధముగాఁగలదైన ఇంద్రాణియు, గణనాయకునితోను శివునితోను కూడుకొన్న చాముండయు— ఈమాతలు నన్నురక్షింప్రదురుగాక.

రఙ్గమణ్టప మధిశిశ్యే=రంగమంటపమందు పరుండెను.

౧౦౯-వ పుట.

దరీదృశ్యతే=మిక్కిలి అగపడుచున్నాఁడు. పారద=పాదరసము వలె. వీచి=కరటముయొక్క. ఫేన ఉపమమ్=నురుఁగు ఉపమానముగాఁగలది అనఁగా నురుఁగువంటిది. స్వ...నమ్=స్వర్గముయొక్క తలుపు గడియను తీయునదైన. పరిగతః=ఆవృతుఁడై. మణ్డలాగ్రమ్=కత్తిని.

౧౧౦-వ పుట.

స్వసు ఖేతి=తనసుఖమందు ఆశలేనివాఁడవై లోకముకొఱకు ప్రతిదినము ఖేదపడుచున్నావు, నుతి యేమి, నీస్వభావ మిట్టిదిగానే ఉన్నది. చెట్టు (తన) తలతో ఉగ్రమయిన యెండను అనుభవించును, తన్నాశ్రయించినవారి పరితాపమును నీడచేత నివారించును.

ధురన్ధర=భారమును మోయువాఁడా. జాహ్నవీ=గంగ.

౧౧౧-వ పుట.

కర్పూరా దితి=కర్పూరముకంటెను తెల్లఁగలువకంటెను, వికసించుచున్న మల్లెమొగ్గకంటెను, ఆకాశగంగయొక్క గొప్పకరటముకంటెను, మొగలిపువ్వుకంటెను, చంచలమయిన కాంతాకటాక్షముకంటెను, దూరమందు వదలఁబడిన మచ్చగలవాఁడైన (మచ్చలేనివాఁడైన) శివశిరస్సుమీఁది చంద్రునియొక్క కళకంటెను, తెల్లనివైన నీకీర్తులచేత ఏడుసముద్రములుకలదైన భూమి తెల్లనిదిగాఁ జేయఁబడినది.

దేవ=ఏలినవారనెడు. దేవతరు=కల్పవృక్షముయొక్క. మత్=నాకంటె. వదాన్య=దాతలయొక్క.

౧౧౨-వ పుట.

వేధా ఇతి=బ్రహ్మ దర్భచీపుఁరే స్వరూపముగాఁగలవాఁడు, (వేదస్వరూపుఁడు) విష్ణుమూర్తి పసులకాపరియు రోగముచేత క్రిందివాఁడును (లోకపాలకుఁడుఁడును గదాయుధధారియు), శివుఁడు శూలరోగియు దుఃఖస్వభావుఁడును (శూలాయుధుఁడును విషము భక్షించువాఁడును); ఏలినవారు ఎవనితో పోల్పఁదగుదురు? (అనఁగా ఏలినవారి కెవరును సాటిగారు.)

భూమిజానిః=రాజు. శ్వః ప్రభాతే=రేపు ప్రొద్దున.

౧౧౩-వ పుట.

అమర...సాదితమ్=దేవరాజుదయచేత పొందఁబడినదైన. సామాజికాః=సభికులు. పూర్వదేవానామ్=రాక్షసులకు. సవిధే=సమీపమందు. ఊరీచకార=అంగీకరించెను. ప్రణయినీమ్=ప్రియురాలిని. ముష్టి=పిడికిటిచేత. రూషితః=పూయఁబడిన. దివః=ఆకాశమునుండి. ప్రతిభటైః న్యపాత్యత=శత్రువులచేత చంపఁబడెను. కబన్ధః=మొండెము. యావత్ అమర్యాః న వృణతే=అప్సరసలు వరింపకముందే.

౧౧౪-వ పుట.

కౌముదీ=వెన్నల. తటిత్=మెఱుపు. ప్రలీయతే=అడఁగిపోవును. ప్రమదాః=స్త్రీలు. పతివర్త్మగాః=పతిమార్గమునుపొందువారు (సహగమనము చేయువారు). ప్రతిపన్నమ్=అఙ్గీకరింపఁబడినది. హుతాశనమ్=అగ్నిని. మహీయతే=పూజింపఁబడుచున్నది. వ్యాళగ్రాహీ=పాములవాఁడు. వ్యాళమ్=పామును. మోదతే=సుఖించును.

శ్మశాన వట వత్=వల్లకాటి మఱ్ఱిచెట్టు వలె.

౧౧౫-వ పుట.

భూషణైః=అఙ్గరాగములచేతను. పరా=ఉత్తమమయిన. శ్రవణ

సాత్ కృత్వా=వినిఁ శ్రీఖణ్డ=చన్దన, చితామ్=సొదను. పావకమ్=అగ్నిని. తిగ్మభానౌ=వేఁడికిరణములుగలవాఁడైనసూర్యుఁడు. ఉదయ...తనౌ=తూర్పుకొండయొక్క శిరోమాల్యమువలె ఆచరించిన దేహము కలవాఁడగుచుండఁగా, అనఁగా తూర్పుకొండయొక్క శిరస్సున పూలదండవలె (సూర్యుఁడు) ఒప్పుచుండఁగా. సామన్త సంహతి ప్రణతీః=చిల్లరరాజుల సమూహముల నమస్కారములను.

## ౧౧౬-వ పుట.

మధుకర నికురుమ్బ=తుమ్మెదల సమూహముచేత అమ్లానామ్=వాఁడని. సందేశమ్=కబురును, వార్తను. ప్రధనానుబన్ధాః=యుద్ధసంబంధమయిన. దైత్యానామ్=రాక్షసులకు. సంగ్రామః=యుద్ధము. దానవాః=రాక్షసులు. కాన్దిశీకాః=పాఱిపోయినవారు. ఆకలయ్యాశ్చ్యకార=తొడిగెను. జోష మాస్యతే=ఊర కున్నావు. సంగోప్య=దాచి. అపచరితమ్=అకార్యము.

## ౧౧౭-వ పుట.

శుద్ధాన్త చరాన్=అంతఃపుర చరులైన. సౌవిదల్లాన్=కంచుకులను, అంతఃపురపాలకులను, కోటి=అగ్రములచేత. పాటలిత=ఎఱ్ఱఁగాఁజేయఁబడిన. పూర...మార్గణ=ప్రవాహమందు ఈఁదుచున్న సకలయాచకులుకలవాఁడా, తరఙ్గిత=కరటములుగలదైన. కరః=కప్పము. హాటక=బంగారముయొక్క.

## ౧౧౮-వ పుట

మతి కౌశలాత్=బుద్ధి చాతుర్యమునకు. విలసతః=సంతోషించిన. అపోహ్య=పోఁగొట్టి. హన్తుమనసమ్=చంపఁగోరిన, దిగ్వాససమ్=దిగంబరుని. ఉద్దామయశః=గొప్పకీర్తికలవాఁడా. శశాస=ఏలెను.

ధ్యా నేతి=ధ్యానమనుమిష నవలంబించి ఎవతెను తలపోయుచున్నావు? కన్నుదెఱచి క్షణముసేపు మన్మథబాణపీడితలమైన మమ్ముచూడుము. కనికరముగలవాఁడవని అబద్ధపుఖ్యాతినిపొందియున్నావు. క

నికరములేనివాఁడు నీకన్న మఱియెవఁడు? మన్మథుఁడు పంపిన స్త్రీ లచేత అసూయతో ఇట్లు చెప్పఁబడిన జ్ఞానియైన జినదేవుఁడు మిమ్ము రక్షించునుగాక.

యచ్చాపేతి=ఎవనియొక్క వింటిని పొందిన సిరి దేవతలకు ఇల్లో (మేరుపర్వతము ఎవనికి విల్లో), ఎవని గుఱ్ఱపు తబేలా బ్రహ్మయొక్క ముఖములో (బ్రహ్మముఖములందలి వేదములు ఎవనికి గుఱ్ఱములో), ఎవనియమ్ములపొది మేఘములపాన క్షేత్రమో (సముద్రము ఎవనికి అమ్ములపొదియో అనఁగా సముద్రశాయియైన విష్ణువు ఎవనికిబాణమో), ఆదేవుఁడు [శివుఁడు] మీకుమంగళమును గలుగఁజేయునుగాక.

మద...యితమ్=మదముచే ఒప్పుచున్నతుమ్మెదవలె నుండునది.

౧౧౯-వ పుట.

ఉదశ్చయామాస=లేపెను (పలికెను). హవనమ్=హోమమును. శమీ=జమ్మిచెట్టు. వరీవృత్యతే=తఱుచుగానుండును. స్కన్ధే=బుజముమీఁద. ఫలిష్యతి=పగలును.

౧౨౦-వ పుట.

ప్రేష్యః=నౌకరు. కశయా=కొరడాతో. పన్నగైః=పాములతో. శక్రతామ్=ఇంద్రత్వమును. సర్వ భక్షః=సకలమును తినువాఁడు. అపేయః=త్రాగరానివాఁడు. సోమమ్=చంద్రుని. హవ్యాని=ఆహుతులను. త్రిదివౌకసః=దేవతలు. కవ్యాని=పితృదేవతల కీఁబడినవానిని.

౧౨౧-వ పుట.

అవ్యయమ్=నాశహీనుఁడైన. బాలిశః=తెలియనివాఁడు.

౧౨౨-వ పుట.

సార్వభౌమః=సర్వభూమికిని ప్రభువను—ఛిన్ధి=ఛేదింపుము. శతతమీం కళామ్=నూఱవ పాలునకును.

౧౨౩-వ పుట.

కాష్ఠమయ ఖడ్గేన=కొయ్యకత్తితో. నతుః అకూపార పరిక్షిప్త=

నాలుగు సముద్రముల చేత చుట్టఁబడిన. నిస్సపత్నమ్=శత్రురహితము. దుర్గతి=దారిద్ర్యము యొక్క. పుత్త్రికా=బొమ్మ. చిత్రార్పిత మివ=పటములోవ్రాయఁబడినప్రతిమ వలె. త్రపా=లజ్జయొక్క.

౧౨౫-వ పుట.

వ్యాఘ్ర భల్లూక ప్రముఖ శరారు నికరా దపి=పులులు ఎలుఁగుబంట్లుమొదలయిన ఘాతుకజంతువులయొక్క సమూహమునుండి కూడ. ఉత్పేతుః=ఎగిరిపోయిరి. శశాస=పరిపాలించెను.

విక్రమార్క చరిత్ర టిప్పణము

సమాప్తము.

ఓం తత్ సత్.



## శుద్ధపత్త్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౪ | ౨౫ | విశ్త | కార్య | ౫౮ | ౭ | ర్యాత | కుర్వత |
| ౧౨ | ౮ | పణిత | పణ్డిత | ౭౮ | ౭ | ప్రదిన | ప్రతిదిన |
| ౧౭ | ౧౨ | లలమ్బ | లలమ్బే | ౮౨ | ౩ | ఘుటికా | ఘుటికా |
| ౨౨ | ౨౫ | మః | మ | ,, | ౨౪ | అపద | ఆపద |
| ౨౭ | ౭ | మేవే | మేవై | ౧౦౭ | ౨౧ | తమా | తమో |
| ౫౪ | ౭ | ప్రచ్ఛయ | ప్రయచ్ఛ | ౧౧౯ | ౧౨ | ణత | గత. |
| ౫౬ | ౨౨ | మూరో | మూరో | ౧౨౯ | ౩ | వానిని | వాని |